అంఆ

# అమ్మనోటి ఆణిముత్యాలు



జిల్లెళ్ళమూడి అమ్మ

★

లక్కింశెట్టి కాంతారావు, వెంకట అప్పల రాజ్యలక్ష్మి
ఏలూరు






పదిమంది కోసం పని చెయ్యి.

పదిమంది కలిసి పని చెయ్యి.

"జయహో మాతా శ్రీ అనసూయా
రాజరాజేశ్వరి శ్రీ పరాత్పరి"

కీర్తిశేషులు **బంగారు వెంకట్రావు, సీతానాగభూషణం**
**లక్కింశెట్టి కాంతయ్య (వెంకట సుబ్బారావు)**
**సీతారావమ్మ**

**కేసరిపల్లి వెంకటమాణిక్యాలరావు (చంటిబాబు)**
**అచ్చమాంబ** గార్ల జ్ఞాపకార్థం



భక్త్యంజలి పూర్వకంగా
**లక్కింశెట్టి కాంతారావు**
**వెంకట అప్పల రాజ్యలక్ష్మి**


కాపీలు : 1000

వెల : అమూల్యం

ముద్రణ : చైత్రశుద్ధ ఏకాదశి 13-4-2003
81వ అమ్మ జన్మదినోత్సవం

సంకలనం : టి.టి. అప్పారావు

ప్రాప్తిస్థానం : మాతృశ్రీ అధ్యయన పరిషత్
డోర్ నెం. 23బి-10-11, ఆర్. ఆర్. పేట
ఏలూరు - 534 002, ఫోన్ : 230975

# భక్త్యంజలి

అనురాగాన్ని పంచి అప్యాయతను పెంచి అందరికీ అమ్మగా అనుభూతినిచ్చి మాటలో, చేతలో, ఊహలో భక్తిని జ్ఞానాన్ని అచరణను అందించి, తనరాక ఈ లోకంకోసమేనని చాటి, ముముక్షువులకు యోగులకు మార్గదర్శియై, జ్ఞానులకు జ్ఞేయమై ఆదరణకు ఆలవాలమై, అన్నపూర్ణాలయములో ఆరని అఖండ జ్యోతియై, అర్కపురిలో (జిల్లెళ్ళమూడి) అమ్మగా తన అవతార ధ్యేయాన్ని పరిసమాప్తం గావించి ప్రేమరాశిగా, కరుణామయిగా, మాతృమూర్తిగా వెలిగి ఎందరో హృదయాలలో జ్ఞానైశ్వర్య జ్యోతిని వెలిగించిన **అమ్మ చరణ కమలాలకు ఈ చిరుకానుక.**

ADDRESS :
LAKKIMSETTI KANTHA RAO
AADIVARAPUPET, ELURU -5
PHONE : 230808

# విషయసూచిక

# ప్రార్థన

యయా శక్త్యా బ్రహ్మ కమలనయన: ఫాలనయన:

జగత్ స్రష్టుం పాతుం ప్రళయమ్ ఉపనేతుంచ కుశలా:

యయా వ్యాప్తం విశ్వం వసతి ఖలు యస్యాం జగదిదం

నమామి ఆద్యాందేవీం ముకుళిత కరస్తామ్ **"అభయదామ్"** ॥

# 1. అమ్మంటే ఎవరు?

1923 మార్చి 28వ తేదీన బాపట్ల తాలూకా మన్నవ గ్రామంలో శ్రీ మన్నవ సీతాపతిరావు, రంగమ్మ పుణ్యదంపతులకు అమ్మ జన్మించింది. పుట్టక ముందు - పుట్టిన తరువాత కూడా ఎన్నో అద్భుతాలను ప్రదర్శించిన అమ్మ అందరికీ "అమ్మ" గానే అనురాగాన్ని అందించింది, అనునయించింది - ఆదరించింది. అప్యాయతను వర్షించింది.

అమ్మను ఆదిపరాశక్తిగా, రాజరాజేశ్వరిగా, అమ్మలగన్న అమ్మగా కొందరు ఆరాధించారు. అమ్మను పండితులు వాగ్దేవి అన్నారు. వేదాంతులు వేదమాత అన్నారు. ఆ పరిపూర్ణ దివ్య మాతృప్రేమే స్త్రీరూపాన్ని ధరించి భూమి మీదికి వచ్చి నిల్చినది. ఆ దివ్య పరిపూర్ణ మాతృప్రేమ వాహినిలో నిమగ్నమై ఎందరో దేహధారులు తరించారు. తల్లికి తప్పే కన్పించదని - అర్హతలు తన ఆలోచనకు రావని అంటుంది అమ్మ. "మీరు తినకపోతే చిక్కిపోతారు - నేను పెట్టుకోకపోతే చిక్కిపోతాను" అంటుంది అమ్మ. గృహస్త్రాశ్రమం సాధనకు అడ్డురాదని, కోటలో

నుండి యుద్ధం చేయడం గృహస్థాశ్రమమని, కోట విడిచి యుద్ధం చేయడం సన్యాసాశ్రమమని అమ్మమాట. "ఈ కనిపించేదంతా అదే" అని అంటుంది అమ్మ. "జగత్తు - జగదీశ్వరుడు. వేరుకాదు, ఒకటే!" అని బోధించింది అమ్మ. సాధన గురించి చెబుతూ "ధ్యాసే ధ్యానము" అని "సాధ్యమైనదే సాధన" అని అమ్మ అంటుంది.

"ఒకటే ఇన్ని అయినది. కనుక అన్నింటిలో ఒక దానిని చూడడమే అధ్యాత్మిక సాధన" అంటూ, "అనేకంగా కనిపిస్తూ ఒకటిగా అనిపించడమే జ్ఞానము" అంటుంది అమ్మ. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు మంత్రరూపంగా నడపడం ప్రాణాయామమని అంటుంది అమ్మ. గురువును గూర్చి చెబుతూ, "గుర్తే" (గుర్తించే శక్తి) గురువు అన్నది అమ్మ.

"సృష్టినాది - అనాది. ఇదంతా నా సంతానమే" అన్నది అమ్మ. "సృష్టికి బీజం శక్తి". "రూపం లేనిది రూపం దాల్చడమే సృష్టి" అని, " సృష్టికి పరిణామమే గాని నాశంలేదు". అని అమ్మ సిద్ధాంతం. "సర్వానికి సర్వం అధారం. సృష్టికి ప్రత్యేకంగా అధారంలేదు" అన్నది అమ్మ.

"మా బాధలు నీకెలా తెలాస్తాయమ్మా" అని అడిగితే "మీ శరీరంలో కంటి బాధ కాలికి - కాలి బాధ కంటికి తెలియకపోయినా అన్నిటి బాధలూ మీకు ఎలా తెలుస్తాయో అలాగే మీ అందరి బాధలు నాకు తెలుస్తాయి" అంటుంది అమ్మ. "ఆత్మసాక్షాత్కారమంటే ఏమిటమ్మా ?" అని అడిగినప్పుడు "ఈ కనిపించేదంతా ఆత్మగా తోచడమే ఆత్మసాక్షాత్కారం అన్నది అమ్మ.

మొదట్లో అమ్మ నివాసం ఒకపాకలో. అమ్మ దర్శనార్థం వచ్చిన వారికి అక్కడి మట్టిని ప్రసాదంగా పెట్టేదట. అది సువాసన కలిగి యుండుటయే గాక రుచిగా కూడా ఉండేదట. 1956లోనే అమ్మ ప్రక్క గ్రామమైన "కొమ్మూరు" నివాసి డా॥ అనంత సీతాచలం గారిని పిలిపించి "నేను సమాధిలో మూడు రోజులుం టాను. తిరిగి వచ్చేవఱకు శరీరాన్ని కాపాడవలసింది అని అదేశించి సమాధిస్థితిలో మూడు రోజులుండి జాగ్రదవస్థలోనికి వచ్చింది అమ్మ. అంతకు ముందున్న చామన ఛాయ మేనిరంగు పోయి, పశిమి బంగారు రంగుగా మారి, అది శాశ్వతంగా ఉండి పోయింది అమ్మకు.

మౌనం అంటే అవసరమైనంత మేరకు మాత్రమే మాట్లాడటం అంటుంది అమ్మ. అమ్మ ఏ పూజలూ చేయలేదు. ఎట్టి సాధనలనూ ఆచరించలేదు. నిత్యం తన మంగళసూత్రాలను అభిషేకం చేసి భర్తనే భగవంతుడుగా ఆరాధించేది. పతిని ఆధారం చేసికొని పంచభూతాలను జయించడమే పాతివ్రత్యమన్నది అమ్మ. పతి రూపమునే ఆలంబనగా చేసుకొని సర్వాన్ని జయించేదే "సాధ్వి" అని కూడా చెప్పింది.

రెండు భిన్నాభిప్రాయాలు ఒక చోట కలసి ఏకత్వంగా కాలం గడపడమే వివాహమన్నది అమ్మ. అమ్మను సామాన్యులు - అసామాన్యులు; సాధకులు -సాధుపురుషులు; అర్తులు -జిజ్ఞాసులు ; గృహస్తులు - పీఠాధిపతులు; భక్తులు - యోగులు ఎందరో దర్శించేవారు. శ్రీ కల్యాణానంద భారతికి అమ్మ నాలుగేండ్ల ప్రాయములో బ్రహ్మ సూత్రాలకు వివరణ ఇచ్చింది.

వాసుదాస స్వామి వారికి (వావిలకొలను సుబ్బారావు గారికి) రాముడుగా దర్శనమిచ్చింది. లక్ష్మీకాంత యోగికి మహాయోగిగా కనిపించింది. రఘువరదాసు

గారికి జగన్మాతగా అనుభవమిచ్చింది. ప్రభుదత్త బ్రహ్మచారిగారికి కృష్ణుడుగా దర్శనమిచ్చింది. లక్ష్మణ యతీంద్రులవారికి రాముడుగా భాసించింది. కాశీ కృష్ణమాచార్యుల వారికి రాజరాజేశ్వరిగా అభయమిచ్చింది. ఇట్టివి ఎన్నో! అమ్మ గృహస్థాశ్రమాన్ని స్వీకరించి సంతానాన్ని పొందినా ఈ చరాచర సర్వ జగత్తునూ తన సంతానంగా చూస్తూ ఆనందించేది. అందుకే **జగన్మాత** అయింది. గడ్డాలు మీసాలు నెరసిన వారు కూడా అమ్మకు అడ్డాలలో బిడ్డలే.

లక్షమందికి ఒకే పంక్తిని భోజనాలు ఏర్పరచి ఆనందించింది అమ్మ. జిల్లెళ్ళమూడి వెళ్ళిన ప్రతి వారిని అమ్మ అడిగే మొదటి ప్రశ్న "భోజనం చేశావా నాన్నా ?" అని.

ఆరని అగ్ని హోత్రం - ఆకలి మంటకు అమృత వర్షం అచ్చటి నిరంతర ప్రసాదము. అదే అన్నపూర్ణాలయం. అమ్మ ఆత్మాలయము. అజ్ఞానాన్ని పోగొట్టే జ్ఞానాలయం. జిల్లెళ్ళమూడిలో సంస్కృత కళాశాల ప్రాంగణం, అచ్చటి ఆదరణా లయము, వృద్ధాశ్రమము అమ్మ ఆశయానికి ప్రతి రూపాలు. అమ్మ నివసించే ఆ ఇల్లు అందరి ఇల్లు.



# 2. ఆణిముత్యాలు

★ ధ్యాసే ధ్యానం

★ తృప్తే ముక్తి

★ గుర్తే గురువు.

★ అనుకున్నది జరగదు – తనకున్నది తప్పదు.

★ తిథులు విధిని మార్చలేవు.

★ విధి వర్షంలాంటిది. కొందరికి అనుకూలం – కొందరికి ప్రతికూలం.

★ పెట్టింది ముహూర్తం కాదు – జరిగిందే ముహూర్తం.

★ మానవుని జీవితం నవగ్రహములమీద ఆధారపడిలేదు.
రాగము, ద్వేషము అను రెండు గ్రహములపై ఆధారపడి ఉన్నది.

★ లేనిదాని కొరకు ఆశించేది దుఃఖం. ఉన్నది చాలనుకునేది సుఖం.

★ జీవితమంటే సమస్యల తోరణం. సమస్యలతో–రణం

★ తన కోరికవేరు – జీవితం వేరు. ఈ రెండింటి మధ్య ఎప్పుడూ ఘర్షణే.

★ ఆశా, అసంతృప్తుల కలయికే జీవితం.

★ బాధలు లేనిది బ్రతుకుకాదు. అలలు లేనిది సముద్రంకాదు.

★ శిల్పానికి అందం రావాలంటే ఉలిదెబ్బలు అవసరం.
జీవితంలో దెబ్బలు తినేకొద్దీ నిశ్చలత పెరుగుతుంది.

★ నేను చేస్తున్నాను అనుకునేది బాధ గల బాధ్యత.
నిమిత్తమాత్రుడను అనుకునేది బాధలేని బాధ్యత.

★ చింతకు కారణం సొంతం అనుకోవడమే.

★ అస్వతంత్రుడికి బాధలెక్కువ - స్వతంత్రుడికి భాద్యతలెక్కువ.

★ కమిటెడ్ మెంబర్లు కావాలిగాని - కమిటీ మెంబర్లు కాదు.

★ సన్యాసం వచ్చేదిగాని యిచ్చేదికాదు.
ఆశయం మారాలిగాని, ఆశ్రమం కాదు.

★ సమయానికి యేది అవసరమో - అది అందటమే సంపద.

★ అడిగినవారికి అడిగింది యిస్తాను - అడగనివారికి అవసరమైంది ఇస్తాను.

★ రాగమూ, ద్వేషమూ కావాలన్న కోరికమీదనే ఆధారపడ్డాయి.

★ పరిమితమైన మమకారం-మానవత్వం-సర్వత్రా ఉంటే మాధవత్వం.

★ తన కొరకు చేస్తే రాగం - ఇతరుల కొరకు చేస్తే త్యాగం.

★ సర్వత్రా అనురాగమే విరాగం.

★ కష్టంలో ఉన్నవారిని చూచి స్పందించగలిగేదే మానవత్వం.

★ ఆర్తులు అనాధుల సేవయే ఆదినారాయణ సేవ.

★ ధర్మంలో కట్టుబాట్లు ఉన్నాయిగాని - ప్రేమలో లేవు.

★ పూర్తి ఆస్తికుడికి, పూర్తి నాస్తికుడికి తేడా లేదు.
ఆస్తికుడు అంతా దైవం చేశాడంటాడు.
నాస్తికుడు అంతా తానే చేసానంటాడు.

★ పుట్టుకతో జ్ఞానము ఉన్నవాడు - అవతారుడు.
వచ్చి సాధన చేసేవాడు జ్ఞాని.

★ నిగ్రహం కొరకే విగ్రహారాధన.

★ ఆకారం మారేది - నిరాకారం మారనిది.

★ సాకారాన్ని గుర్తించటానికి నిరాకారం - నిరాకారాన్ని గుర్తించటానికి సాకారం అవసరం.

★ కాలువనిండా నీళ్లు ఉన్నా దిగటానికి రేవు కావాలి.
దేవాలయాలు, ఆశ్రమాలూ అటువంటివే.

★ అద్వైతమే విశిష్టత అని శంకరులు అన్నారు.
విశిష్టతే అద్వైతమని రామానుజులు అన్నారు.

★ లక్ష్మణుడు, రాముని దగ్గర వున్నాడు.
భరతుడు, రాముణ్ణి దగ్గర ఉంచుకున్నాడు.

★ పురుషకారం - దైవసహాయం ఒకే నాణానికి రెండు ముఖాలు.

★ అనుభవం శాస్త్రాన్నిస్తుంది గాని - శాస్త్రం అనుభవాన్ని ఇవ్వదు.

★ స్థిమితమైన ప్రజ్ఞ కలవాడు స్థితప్రజ్ఞుడు.

★ మృత్యువు అంటే భయం లేనివాడు – మృత్యుంజయుడు.

★ తనని తాను గుర్తించినవాడు – సర్వాన్ని గుర్తిస్తాడు.

★ నేనెవరు అన్న ప్రశ్నకు సమాధానం దండలోని దారమే...., పూసలు ప్రక్కకు లాగినపుడు దారం కనిపించినట్లుగా....!

★ రేకులన్నీ పూవులో భాగమైనట్లు, మనమందరము వాడిలోని వారమే.

★ అంతా జీవమయమే గాని, నా దృష్టిలో జడం లేదు.

★ రాయిలో చైతన్యాన్ని చూడగల మనం – మనిషిలో చూడలేకపోతున్నాం.

★ నేను మీలో దైవత్వం చూస్తాను – మీరు నాలో మానవత్వం చూస్తారు.

★ నీవు అనుకున్న రూపంలో భగవంతుడు కన్పిస్తే గుర్తిస్తావు లేనప్పుడు నీముందున్నా గుర్తించలేవు.

★ ఎదుటివారిలో దైవత్వం చూస్తున్నంతసేపు నీలో దైవత్వం కలుగుతుంది.

★ విశ్వాసమే భగవంతుడు – నీ విశ్వాసమే రూపం ధరించి నిన్ను రక్షిస్తుంది.

★ దేవులాడితే దొరకని వాడు దేవుడు – అంతటా ఉన్న శక్తే భగవంతుడు.

★ సర్వమూ దైవమయమని తెలుసుకోవడమే సర్వజ్ఞత్వం.

★ సృష్టినంతా దివ్యంగా చూడటమే దివ్యదృష్టి.

★ పంచభూతములు యేశక్తిచేత నడుపబడుతున్నాయో - ఆ శక్తే దేవుడు

★ కదిలే కాలు కనిపిస్తుంది - కదిలించే శక్తి కనిపించదు.

★ ప్రయత్నం కనబడుతుంది - ప్రేరణ అర్థం కాదు.

★ చేతులు నీవి కాని - చేతలు నీవి కావు.

★ జీవితం - జీవనం భగవంతుడిచ్చినవే.

★ కలత లేకపోతే - నలత ఏం చేస్తుంది ?

★ దుఃఖానికి చరమదశ సంతోషం - సంతోషానికి చరమదశ దుఃఖం.

★ భరించలేనిది బాధ - సహించలేనిది హింస.

★ ఇష్టం లేనిది కష్టం

★ వర్గం లేనిది స్వర్గం.

★ పోట్లాడినా చేసేది తల్లి - చేస్తున్నా పోట్లాడేవాడు బిడ్డ.

★ తనను కన్నవారి మీద కన్నా - తాను కన్నవారిమీదే ప్రేమ ఎక్కువ

★ బిడ్డ బురద పూసుకున్నా - కడిగి దగ్గరకు తీసుకునేది తల్లి.

★ తల్లికి బరువు లేదు - బిడ్డకు బదులు లేదు.

★ అసలైన అమ్మకు ఎవరిని చూచినా బిడ్డే అనిపిస్తుంది.

★ తల్లికి తప్పే కనిపించదు రావణాసురుడు దుర్మార్గుడని, లోకకంటకుడని, తల్లి ప్రేమించకుండా వుందా ? ఆ స్థానం అలాంటిది.

★ అడిగితే పెట్టేది అమ్మకాదు - అడక్కుండా పెట్టేది అమ్మ.

★ తల్లి రక్షణ కాదు - రక్షణే తల్లి.

★ చెట్టుకు - కాయకు ఉన్న సంబంధమే నీకు - నాకు.

★ అమ్మ అంటే - ఆది అంతము లేనిది.

★ మన బిడ్డయందు ఏమి చూస్తున్నామో - అందరియందు దానిని చూడడమే బ్రాహ్మీస్థితి.

★ పతిని ఆధారం చేసుకొని పంచభూతాలను జయించడం పాతివ్రత్యం.

# ప్రాణాయామం

★ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఎట్లా నడుస్తున్నాయో గమనించడం - ప్రాణాయామం.

★ సర్వకాల సర్వావస్థలయందు నడిచేవి - ఉచ్ఛ్వాస నిస్వాసాలైనప్పటికీ వానిని మంత్రరూపంగా నడపడం - గుర్తించడం కూడా ప్రాణాయామమే.

★ ప్రాణమంటే శ్వాస కాదు. శ్వాస ఆపి కూడా బ్రతకవచ్చు.

అన్ని వ్రతాలు ఆడవారికే - మగవాడికి ఒక్కటే వ్రతం
అదే ఏకపత్నీవ్రతం.

# 3. సందేహాలు - సమాధానాలు

ప్రశ్న : దేవుడే పెడతాడని కూర్చుంటే వస్తుందా?

అమ్మ : వస్తుంది - నీవు కూర్చోలేవు. కూర్చుంటే పెడతాడు.

ప్రశ్న : అమ్మా నీవు ఏమి మాట్లాడినా శ్రుతి సమ్మతంగా ఉంటుంది ఎలా తెలుస్తుందమ్మా?

అమ్మ : శ్రుతుల సంగతి నాకు తెలియదు నాన్నా ! ఇవన్నీ నా స్మృతులే.

ప్రశ్న : హృదయాన్ని కదిలించావు గదమ్మా !

అమ్మ : హృదయాన్ని కదిలించడం కాదు నాన్నా! కదిలేదే హృదయం!

ప్రశ్న : మద్రాసులో మౌంటు రోడ్డు మీద నీ నామం చేస్తూ నడుస్తుంటే నీకెట్లా కనిపిస్తానమ్మా ? అంటూ ఒక అన్నయ్య ప్రశ్న?

అమ్మ : నాకంటికెదురుగా ఉన్నట్లుగా కనిపిస్తావు.

ప్రశ్న : సంసారంలో బాధలెక్కువగా ఉన్నాయి. మోక్షమార్గం చెప్పమ్మా?

అమ్మ : సంసారం బాధ అనిపించకపోవడమే మోక్షం.

ప్రశ్న : బైబిలు, ఖురాన్‌ల సారం ఒక్కమాటలో చెప్పమ్మా ?

అమ్మ : అహం బ్రహ్మాస్మి - ఖురాన్ సారం:

మామాత్మా సర్వభూతాత్మా - బైబిల్ సారం:

# 4. సృష్టి - శక్తి

★ రూపం లేనిది రూపం ధరించడమే సృష్టి.

★ రూపాంతరమే గాని రూపనాశనం లేదు.

★ సృష్టి సహజం.

★ సృష్టి ఎప్పుడూ ఉన్నది - వ్యవస్థలోనే మార్పు.

★ రూపం పురుషుడు - శక్తి ప్రకృతి. ఒక దానిని విడిచి మరొకటి లేదు.

★ సృష్టికి ఆది అంతమూ లేదు.

★ సృష్టికి పూర్వం లేదు.

★ రూపంలో గుణంలో భిన్నత్వమే సృష్టి.

★ మారేది మారనిదానిలో నుండి పుట్టినది.

★ పరిణామమేగాని నాశం లేదు.

★ పరిణామానికి చరమదశ బ్రహ్మస్వరూపం.

★ సృష్టికి వికాసం ఎంత సహజమో విలయమూ అంతే.

★ సమిష్ఠి యొక్క వ్యష్ఠిత్వమే మాతృత్వం.

★ సృష్టికి బీజం శక్తి.

★ శక్తి అంటే అన్నిటికీ మూలమైనది.

★ అంతటా ఉన్న శక్తే భగవంతుడు.

★ రెండు అయినది - రెండు కానిది దైవం. రెండూ ఆ దైవమే అయినా, రెండు అయితే గాని సృష్టి నడవదు.

# 5. భక్తి -యోగం -జ్ఞానం

★ భక్తి అంటే మనోవాక్కాయ కర్మలకు అతీత స్థితి (గోపికా భక్తి).

★ చిన్నగా ఉన్నప్పుడు భక్తి - పెరిగినప్పుడు యోగం - పండినపుడు జ్ఞానం.

★ భక్తి బాల్యం లాంటిది.

యోగం యౌవనం లాంటిది.

జ్ఞానం వృద్ధాప్యం లాంటిది.

★ దైవంలో చూసే భక్తి - శ్వాసలో చూస్తే యోగం.

శ్వాసతో మనస్సు నిలవదు - మనస్సుతో శ్వాస నిలుస్తుంది.

★ అవయవాల చేత మనస్సు కట్టుబడితే ...ప్రాణాయామం.

మనస్సుచేత అవయవాలు కట్టుబడితే......... భక్తి.

★ భక్తి యోగం, జ్ఞానయోగం ఒకదానిని విడిచి ఒకటి ఉండవు.

★ భగవంతుడు అంటే - సైన్సు "స్వభావం అంటుంది."

★ అధ్యాత్మికం "దైవం" అంటుంది.

★ భగవంతుడు అన్ని రూపాలలో ఉన్నాడు.

అన్ని రూపాలూ అయనవే. కనుక "రూపరహితుడు".

అన్ని గుణాలూ అయనవే గనుక "గుణరహితుడు".

అన్ని నామాలూ అయనవే గనుక "నామ రహితుడు ".

అన్ని సంకల్పాలు అయనవే గనుక "సంకల్పరహితుడు".

సర్వం తానైనవాడు గనుక - స్వార్థరహితుడు.

★ మిరపకాయకు కారం స్వభావం అంటాడు నాస్తికుడు. కారం పెట్టాడు అంటాడు భక్తుడు.

★ రాతితో కడితేనే దేవాలయం కాదు. నీ హృదయంలో నామంతో కట్టు.

★ ఇష్టదైవం తప్ప తాను లేననుకోవడం "ఉపాసన".

తాను లేకపోవడం "ఆత్మార్పణ".

★ ప్రతి వస్తువులోనూ ఒకే దానిని చూడడం "ఏకాగ్రత".



# 6. మంత్రము

★ మరపురాక పోవడమే మంత్రసిద్ధి.

★ మలం పోతే మంత్రం గుర్తుకొస్తుంది.

★ మనస్సుతో మనస్సు నేరుగా గుర్తించలేదు.

★ వేరొకదానిని ధ్యేయంగా పెట్టుకొని గుర్తించడం........మంత్రజపం

శ్వాస పైకి పోయినపుడు క్రిందికి వచ్చినప్పుడు

నోటితో అక్షరాలు ఉచ్చరిస్తే..............................మంత్రధారణ

జరిగే శ్వాసను గుర్తిస్తే.................................అజపాగాయత్రి

★ చరమ దశలో ప్రతి మంత్రానికి ఒకే అర్థం వస్తుంది.

★ వినబడే ప్రతి శబ్దమూ ఓం కారమే.

★ ధ్వనులు అనేకం - శబ్దం ఒక్కటే.

★ మనస్సే మంత్రం - శబ్దమే బీజం - దాని నిలకడకే అక్షరాలు

★ మంత్రమంటే భగవంతుని అక్షర రూపమే.

★ రూపాన్ని ధ్యానిస్తే దేనిని పొందుతారో

అక్షరాన్ని ధ్యానించినా దాన్నే పొందుతారు.

★ మననంతో మంత్రమౌతుంది.

★ మంత్రం ఎల్లవేళలా గుర్తురావడం ప్రమాణమే గానీ, ప్రమాదం కాదు.

# 7. మనస్సు

★ అలోచనలు మనస్సు కాదు. మనస్సుకు ఆలోచనలు వస్తున్నాయి.

★ మనస్సు అంటేనే కదలిక. అది లేకపోతే మనస్సు అనే మాట వర్తించదు.

★ శరీరంలో మనస్సెక్కడుంది అంటే, తడిగుడ్డలో తడి ఎక్కడుంది....? అన్నట్లుంది. శరీరం అంతా నిండి ఉంది. శరీరం మనస్సు వేరుగా లేవు.

★ శరీరాన్ని విడిచి మనస్సు - మనస్సును విడిచి శరీరమూ లేదు.

మానసిక బాధ అంటూ ఏముంది - ఏ బాధ అయినా పడేది మనస్సే.

ఎక్కడ లోపం కనబడ్డా, ఎక్కడ మంచి కనబడ్డా మన మనస్సే.

★ మన మనస్సునుబట్టి ప్రపంచం కనిపిస్తుంది.

★ మనిషిని వశపర్చుకోవాలంటే - మనస్సుతోగాని మందులతోగాదు.

★ సహజంగా అందరమూ ఎదుటివాని మనస్సులో ఏమున్నదో తెలియక పోయినా మన మనస్సును బట్టి ఇతరుల ఉద్దేశాన్ని నిర్ణయిస్తాం.

★ ఒకరి మనస్సు మరొకరికిఎవ్వరికి అర్థంకాదు. భార్యాభర్తలయినా, తల్లీబిడ్డలయినా, అఖరికి మార్గదర్శకులమనీ, గురువులమనీ బోధ చేసే వారికి కూడా మనస్సును గుర్తించలేని స్థితి ఉంటూనే ఉన్నది. అసలు మనస్సు అంటే తెలిసినప్పుడు బోధే లేదు. మనస్సుకు రూపం కనబడదు.

★ అలోచనలు ఎక్కడ నుండి వస్తాయో తెలియదు – ఆలోచన వచ్చిన తరువాత తెలుస్తుంది.

★ థాట్ (ఆలోచన) వచ్చిందంటారు. ఎక్కడ నుండి వచ్చింది ? వచ్చిన తరువాత తెలుస్తోంది. దానినే ప్రేరణ అంటారు. మనస్సుతో మనస్సును గుర్తించడం ఎలాఅంటే.... మనస్సును గుర్తించడానికి భక్తి అధారం అయ్యింది – భక్తికి మనస్సు ఆధారం అయ్యింది.
అదే మనస్సుతో మనస్సును గుర్తించడం.

★ మనస్సును మనస్సుతో గుర్తించలేదు గనుక వేరొక దానిని గుర్తు పెట్టుకొని జపించాలి – అదే "మంత్రజపం"

★ శరీరంలో ఉండి శరీరంతో సంబంధం లేకుండా శరీరాన్ని (ఇంద్రియాల్ని) పని చేయించేది – "మనస్సు"

**నేను - నీవైన - నేను**

**నేను - నేనైన - నేను**

**అన్ని నేనులు నేనైన - నేను**

# 7. సీతారాములు



విరామం లేనిది రామం

ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు విరామం లేదు,

సృష్టికి విరామం లేదు. కదలికకు విరామం లేదు.

విరామంలేని ప్రతి ఒక్కటీ రామమే.

ఆ విరామం లేని తన నుండి అవసరాన్ని బట్టి

పరిమితి గల రాముడుగా అవతరించాడు.

తనలో ఉండే శక్తి సీతై, లోకమాతై,

ప్రకృతై, సర్వసాక్షియై, సర్వ ఆరామమై విరాజిల్లింది.

విరామం లేనివారుగా ప్రపంచానికి వారు

ధర్మాన్ని పంచి పెట్టారు. వారే సీతారాములు.

# 9. ఆత్మ సాక్షాత్కారం

★ ఆత్మ అంతటా నిండి ఉన్నది.

★ తెలియటం అంటూ వస్తే శక్తిగానే తెలియబడుతుంది.

★ ఎవరికి ఎక్కడ కనబడితే అక్కడ చూస్తారు.

★ శక్తిరూపంగా అంతటా ఉన్నదే ఆత్మ

★ అనాత్మ అంటూ బయలుదేరితే గాని - ఇది అంతా ఆత్మ అని తెలియబడదు.

★ ఆత్మకు రూపం లేదు.

★ ఆత్మకు ప్రతిబింబం జగత్తు - ఆత్మానుభవం ఉన్నప్పుడు జగత్తు లేదు.

★ అంతా ఆత్మగా తోచడమే ఆత్మసాక్షాత్కారం.

**దేహం ఉన్నన్నాళ్లూ సందేహం తప్పదు**

"భార్యకు భర్త దేవుడు
భర్తకు భార్య దేవత"

"భావం తెలుసుకొని ప్రవర్తించేది భార్య
బాధ్యత తెలుసుకొని ప్రవర్తించేవాడు భర్త"

"ప్రతి స్త్రీలో అమ్మను చూచేవాడికి
అందనిదంటూ వుండదు"

కూతురును, కోడలును
సమంగా చూడటమే
అద్వైతం

